3-12

# లేఖారచన
(పత్రికా పఠనము)

రచయిత

శ్రీ నందూరి వెంకటకృష్ణమాచార్యులు ఎం. ఏ.

తొలిపలుకులు

శ్రీ ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు ఎం. ఏ.
ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు.

ప్రకాశకులు
ఆంధ్ర బుక్ హౌస్ సుల్తానుబజారు
హైదరాబాదు (దక్కన్)

# కొన్ని మాటలు.

శ్రీ నందూరి వెంకటకృష్ణమాచార్యులుగారు వ్రాసిన చిన్న పుస్తకమును 'లేఖారచన' అనుదానిని చదివి యానందించితిని. శ్రీకృష్ణమాచార్యులుగారు కలకలేని ఆలోచనాశక్తియు సరళమైన భావప్రకటనా శక్తియు గలవారు. సాధారణముగ రచనలయందు రెండుదోషములు గాన్పించుచుండును. ఒక చిన్న విషయము నెత్తుకొని దానిపై నేవియో గొప్ప భావతరంగములను ప్రసరింపజేయబోయి, అసలువస్తువును అయోమయముగ జేసిపెట్టుట యొకటి. ఒక మహత్తర లేఖ్యాంశమును చేబట్టి, దానిపై హేతుబద్ధమైన ఆలోచనాశక్తిని కేంద్రీకరింపలేక, వట్టి పదాడంబరమునుచూపి ముదురుబీరకాయపాకము సిద్ధముచేయుట రెండవది. సమర్థులైన రచయితలు ఈ దోషమును పరిహరింతురు. శ్రీ కృష్ణమాచార్యులుగారు ఈ చిన్న పుస్తకమును దానికి తగినంత మృదుభావములతోను కోమల శైలితోను నిర్వహించి కృతకృత్యులైనారు.

లేఖారచనమునందలి ఆధునిక మర్యాదలను, రీతులను ఈ గ్రంథము చక్కగా తెలుపుచున్నది. ఈ యంశములో మన పూర్వపద్ధతికూడ, ఆచరణలో పెట్టనయినను కాకున్నను, తెలిసికొనుటకు ముచ్చటగా నుండును. పల్లెటూళ్ళయందు ఈ రీతి రచన ఇంకను కొంతవరకు ప్రచారములో నున్నది. కాని వేగముగ అదృశ్యమగుచున్నది. లేఖారచనయందు ప్రాతపద్ధతులకును క్రొత్తరీతులకును గల భేదము అప్పటివారి భావము

లకును నేటివారి భావములకును గల అంతరముచేతనే ఏర్పడి
నది. ఇప్పటికి ఒకటిరెండు తరముల వెనుక నుండిన మన పెద్దల
కాలములో సమిష్టి కుటుంబపద్ధతి సజీవమై యుండెను. కుటుం
బములోను గ్రామమునందును అన్యోన్య ప్రీతి స్నేహములు
ఇప్పటికన్న ఒక చూపువాసి మేలుగ ఉండెడివని పరిశీలకులు
చెప్పుదురు. బంధుప్రీతియు, వినయమును వారి మాటలయం
దును, చేష్టలయందును ఎక్కువగా హత్తుకొని యుండెడివి.
బ్రాహ్మణులును బ్రాహ్మణేతరులును ఒండొరులను వావివరు
సలు పెట్టి పిలుచుకొనుచుండెడివారు. ఈనాడు మనము వ్యక్తి
నాగరకతా యుగములో పడినాము. ఎక్కువ కులమువారు
తక్కువ కులమువారు అను విభేదములు మనస్సునందు కాక
కాకపోయినను మాటలయందును వ్యవహార ధర్మమునందును
మాయమగుచున్న కాలమిది. కావున ఎక్కువ వినయాచరణ
మునకుకూడ ఈనాటి లేఖారచనలో స్థానములేదు.

పూర్వములో దేశపాలకులైన మహారాజాధిరాజులకు
ఎన్నో బిరుదావళులుండెడివి. వీరిలో కొందరికి కొన్ని గ్రామము
లకు మించని అధికారమే యుండినను వారివారి బిరుదప్రశస్తి
మాత్రము సుదీర్ఘముగా నుండెడిది. ఇంక సత్యపరాక్రమము
లును విపుల దేశాధీశులు నైనవారిమాట చెప్పవలసినదేమి?
వారిని సంబోధించునప్పుడు దండకమువలె వారి బిరుదప్రశస్తి
చెప్పవలసినదే. వారికి విన్నపములు వ్రాసికొనునప్పుడు
'స్వస్తి శ్రీ సమధిగత పంచమహాశబ్ద, మహామండలేశ్వర, అను
మకొండ పురవరాధీశ్వర, పరమమాహేశ్వర, పతిహితచరిత,

వినయవిభూషణ, శ్రీమన్మహామండలేశ్వర కాకతీయ రుద్రదేవరాజులుంగారి దివ్యసన్నిధికి, దేవర పాదపద్మోపజీవియైన కామారెడ్డి" అని యుపక్రమించెడివారని తోచును. ఏలికయైనరాజు వైష్ణవమతప్రీతి గలవాడైనచో "పరమభాగవత, పరమవైష్ణవ" అని చేర్చుచుండెడివారు. రాజుల తరువాత మిక్కిలి పలుకుబడియు దర్పము శోభనము గలవారు మఠాధికారులుగా నుండిరి. వీరిలో వైష్ణవోత్తముల నొకరీతిగను స్మార్తులైనవారిని మరియొకరీతిగను సంభావించుట యాచారము. వైష్ణవులలో దాసభావము నిరూఢిగా పాతుకొనిపోయినది. కావున ఎవరికి వ్రాయుచున్నారో వారినిగూర్చి హిమాలయమంత ఎత్తయిన విశేషణములను, ఎవరువ్రాయుచున్నారో వారికి సముద్రగర్భమంత నిమ్నమైన వినయోక్తులను ప్రయోగించుట మర్యాద. నాకు తెలిసినంతవరకు వైష్ణవపెద్దలకు వ్రాయురీతి "శ్రీమదుభయవేదాంత ప్రవర్తక, ప్రతివాదిభయంకర శఠగోప అయ్యవార్లంగారి దివ్యసన్నిధికి భక్తపాదరేణువు దాసానదాసుడు నారాయణాచార్యులు వ్రాసికొను విన్నపములు". స్మార్తులైన పీఠాధిపతులకు "శ్రీ వేదమార్గప్రవర్తక" "శ్రీ వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య" ఇత్యాది సంబోధనము జరుగుచుండెడిది.

గృహస్థులలో ఆహితాగ్నులగు వారికి అనగా యజ్ఞయాగాది కర్మల నాచరించినవారికి వ్రాయువిధము "శ్రీమత్ యజనయాజన, అధ్యయన అధ్యాపన, దానాదానషట్కర్మనిరతులును, చతురానన వంశవిభూషణులును, బ్రహ్మశ్రీసక

లును అగు సర్వతోముఖయాజి నాయనగారి దివ్యసన్నిధికి, మీ కుమారుడు కృతానేక నమస్కారపూర్వకముగ వ్రాయునది." సామాన్య సంసారులకు "శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ చిదంబరశాస్త్రులవారికి" అని వ్రాయుట వాడుక. బ్రాహ్మణులలో నియోగులైనవారికి "మ॥రా॥శ్రీ ఎఱ్ఱాప్రగడ గంగరాజు పంతులుగారికి" మొదలుగ వ్రాయుచుందురు. వైశ్యులకు "రాజమాన్య రాజపూజితులైన పులవర్తి సుబ్బిసెట్టిగారికి" అనురీతి వాడుదురని తలతును. పెద్దలకు నమస్కారములు తెల్పియు, పిన్నలకు 'పుత్రపౌత్రాభివృద్ధిగ' ఆశీర్వచనములు పల్కియు వ్రాసెడివారు.

స్త్రీలను గౌరవపురస్సరముగ ఉత్తరములలో సంబోధించుట మనలో ఆచారము. తనకంటె పెద్దవారును, ముత్తైదువలును అగువారికి "మహాలక్ష్మీ సమానురాలైన" అనియు, తనకంటె చిన్నవారును పునిస్త్రీలును అగువారికి "చిరంజీవి సౌభాగ్యవతి" యనియు వ్రాయుదురు. వీరికి "దీర్ఘసుమంగలిగ ఆశీర్వదించి" అని యుండును. పూర్వసువాసినులైనవారిని 'గంగాభాగీరథీ సమానురాలైన అమ్మగారికి" అని సంబోధింప. సంబోధన అయినవెంటనే కుశలవార్తలు వ్రాయవలెను. ...భాగమును సంగ్రహించదలచినప్పుడు రెండు పొడియక్షరములు వ్రాయుదురు. 'ఉ॥ లి'. అనగా ఉభయకుశలోపరి ...యని యర్థము. లేఖాంతమున సెలవుపుచ్చుకొను పద్ధతులు వేరువేరుగా నుండును. ప్రభువులును అధికారులు నైనవారికి

"దివ్యచిత్తమునకు తేవలెను. ఇట్లు విన్నవించు విధేయుడు" అని వ్రాయుట మర్యాద. సామాన్యముగా పెద్దలందరకును "చిత్తగించగలరు" అని యుండును. సమానులును చిన్నలైన వారికిని "గ్రహించవలెను" అని యుండును. కవరుమీది విలాసము వ్రాయునప్పుడుకూడ బంధుత్వ మ్మట్టిపడునట్లు "మామగారికి, బావగారికి" అని వ్రాసెడివారు. కేవలము పేరుమాత్రము వ్రాసి విడిచినచో "ఏమి! బొడ్డుకోసి పేరుపెట్టితివా" యని పెద్దలు మందలించెడివారు. కావున మన పూర్వ పత్రి లేఖనరీతిలో "వినయము, ఆప్యాయము" ఈ రెండును ముఖ్య లక్షణములని తెలియవలెను.

హైదరాబాదు,
17-12-49.

ఖండవల్లి లక్ష్మీరంజనం



విక్రయమునకు సిద్ధముగానున్నవి.

# ఆంధ్ర సాహిత్యచరిత్ర సంగ్రహము

క్రీ. శ. 1800 శతాబ్దము వరకు

రచయిత: ఆచార్యశ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు ఎం. ఎ.

ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు

ఉపోద్ఘాతము: శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు బి. ఎ. బి. ఎల్.

ఈ గ్రంథము పండిత పామరజన రంజకముగ, కథా రూపమున, బహుచక్కగా విమర్శింపబడినది. ఇందు కళాక్షేత్ర ప్రశంస, వచనవాఙ్మయ వికాసము, తెలంగాణా కవులయుదంతము, ఆంధ్రకవియిత్రులముచ్చట, చారిత్రిక కావ్యముల ధోరణి. యక్షగానముల సంవిధానము, శతక వాఙ్మయరీతులు, గేయవాఙ్మయ సౌందర్యము, ఇత్యాదిప్రకరణములతో. భాషా వైశాల్యమును, శోభను, ప్రకాశింపజేయుచున్నది. ప్రతిఆంధ్రుడు చదవదగిన గ్రంథము.

వెల రూ. ౩—౦—౦

# పండుగ బహుమానము.

చక్కని కథలసంపుటి

రచయిత్రి: ఇల్లిందుల సరస్వతీదేవి.

వెల రూ. ౨—౦—౦

ప్రతులకు

ఆంధ్రబుక్ హౌస్ సుల్తానుబజారు

హైదరాబాదు (దక్కన్)

# లేఖారచన

చదువుకొనిన ప్రతివారును ఉత్తరములు చక్కగా వ్రాయుట నేర్వవలయును. ప్రతివానికిని ఏదో వ్యాపారసంబంధమైనట్టి ఉత్తరము వ్రాయవలసిన అవసరము కలుగును. అదిగాక, తన జీవితమునే మార్చివేయునట్టి లేఖను వ్రాయు అవసరముకూడ ప్రతివానికిని జీవితములో ఒకటి రెండుసారులు కలిగితీరును. అందుచేత ఉత్తరములవ్రాయు విద్య కేవలము అలంకారప్రాయమైనదిగాక నిత్యజీవితములో ఉపయోగించునది. దానిని నేర్వకున్న మనము అనేక కష్టనష్టములకు పాల్పడవలసి వచ్చును.

మనఎదుట నున్నవానికి మనము ఉత్తరము వ్రాయము. ఉత్తరమనగా దూరమునందున్నవారికి మనముపంపు సందేశము. ఆ సందేశము నందజేయుటకు ఆచారము, అనుభవము ఆధారముగా వివిధ విధములగు ఉత్తరముల వ్రాయుటకు కొన్ని రూపములు (నమూనాలు) ఏర్పరుపబడినవి. ఈ రూపముల లేక నమూనాల ఉత్తరముల వ్రాయువారు నేర్చుకొని ఉపయోగించవలెను.

ఉత్తరము లనేకవిధములు:—

1. వ్యాపార సంబంధమైనవి.
2. స్నేహితు లొకరికొకరు వ్రాసుకొనునవి.
3. కుటుంబములోనివా రొండొరులకు వ్రాయునవి.
4. ప్రజాహిత జీవితమునకు సంబంధించినవి.

పై వాటన్నిటికికూడ ప్రత్యేకరూపములు గలవు కాని వీటన్నిటికిగూడ కొన్ని సామాన్యాంగములు లేక భాగములు గలవు. ఆ సామాన్యాంగములు లేక భాగములు ఆరు.

1. ఉత్తరము వ్రాయువాని (క) విలాసము (ఖ) వ్రాయు తేదీ.
2. సంబోధన.
3. ఉత్తరములో వ్రాయవలసిన విషయము.
4. శెలవు పుచ్చుకొనుట.
5. సంతకము.
6. కవరుమీద విలాసము.

(1) ఉత్తరము వ్రాయువాని విలాసము, వ్రాయు తేదీ:- ఇది ఉత్తరము చదువువానికి మీరు దానిని ఏ ఊరునుండి, ఏ స్థలమునుండి వ్రాసిరో, ఎప్పుడు వ్రాసిరో తెల్పును. జాబు వ్రాయువారు, తమ పూర్తి విలాసము వ్రాయవలెను. అట్లు వ్రాసిన, మీరు ఎవరికి లేఖ వ్రాసిరో అతను మీకు జవాబు లేక ప్రత్యుత్తరము వ్రాయుటకు వీలుండును.

తేదీయిచ్చిన "మీరు ఫలాన తేదీని వ్రాసిన ఉత్తరమునకు జవాబుగా" అని ఉత్తరము అందినవారు తిరిగి వ్రాయుటకును, ఉత్తరములో వ్రాసిన సంగతులు ఎప్పుడుజరిగినవో తెలిసికొనుటకును అవకాశముండును. ఈ రెండును మీ ఉత్త ములోని మొదటిపుటయొక్క పై భాగమున, కుడిప్రక్కన వలెను. విలాసము ముందుగ వ్రాసి దానిక్రింద తారీఖు య్యవలెను.

ఉదాహరణము:—  452, ఆబిద్ రోడ్డు,
హైదరాబాదు,
30 సెప్టెంబరు 1949.

తేదీ ఉదాహరణములో వ్రాసినట్లు వ్రాయవచ్చును. లేదా 30—9—1949 అనికూడ వ్రాయవచ్చును.

(2) సంబోధన:— సంబోధనాపద్ధతి మీరు ఎవరికి ఉత్తరము వ్రాయుచున్నారో, వారికిని మీకును గల సంబంధముమీద ఆధారపడి యుండును. మీ కుటుంబములోనివారికి:

నాన్నా, పూజ్యులైన నాయనగారికి, అమ్మా, అమ్మగారికి, అక్కయ్యా, అన్నయ్యా, బావా, బావగారికి, చిన్నాయనా, చిన్నాయనగారికి, చిరంజీవి రామమూర్తికి, రామూ, మొదలుగాగలవి.

మిత్రులకు:— మిత్రమా, సోదరా, ప్రకాశం, ప్రియమిత్రమా, ప్రియసోదరా, మున్నగునవి.

వ్యాపారసంబంధము గలవారికి:— ఆర్యా, మహాశయా, అయ్యా, ఆదిగాగలవి.

సంబోధన మొదటిపుటలో ఎడమవైపున ఉత్తరము వ్రాయువాని విలాసమునకు కొంచెము క్రిందుగా ఉండవలెను.

(3) ఉత్తరములో వ్రాయదలచుకొన్న లేక వ్రాయవలసిన విషయము:— ఇదే అసలుఉత్తరము. దీనిశైలి మీరు ఎట్టి ఉత్తరము వ్రాయదలచుకొన్నారో దానిమీద ఆధార

పడి యుండును. ప్రాణస్నేహితునికి వ్రాయు శైలివేరు. ఎవరో వ్యాపారస్తునకు వ్రాయు ఉత్తరపుశైలివేరు. ఉద్యోగస్థులకు వ్రాయు శైలి యీ రెండింటికంటె భిన్నము. కాని వీటన్నిటికి వర్తించు కొన్ని సూచనలు యీక్రింద నీయబడినవి.

(య) మీ ఉత్తరము బొత్తిగా చిన్నదైనతప్ప-విషయ విభాగమును తెలుపుటకు దానిని పేరాలు లేక అనుచ్ఛేదములుగా విభాగించుకొనుడు.

(ర) సరళపదముల ఉపయోగించుడు. వాక్యములుకూడ చిన్నవిగా ఉండునట్లు చూడుడు. వాక్చాతుర్యమును జూపించుటకు పాటుపడకుడు. పెద్దపెద్ద మాటలను, దీర్ఘసమాసములను ఉపయోగించకుడు. మీరు వ్రాయదలచుకొన్న దేదో సరిగా యోచించుకొని, వీలైనంత సూటిగా వ్రాయుడు.

(ల) ఉత్తరములో మీరు వ్రాయదలచుకొన్నది వదలకుండ వ్రాయుడు. మొదలుపెట్టకపూర్వమే వ్రాయదలచుకొన్న దేదో యోచించుకొని, వెర్రి మొర్రిగ గాక, యుక్తాయుక్తముగను, సక్రమముగను వ్రాయుడు. ఉత్తరము పూర్తిచేసి సంతకము చేసినపిమ్మట, ఉత్తరములో వ్రాయక వదలిన సంగతుల వ్రాయుట మీ అజాగ్రత్తను తెలుపును.

(వ) వ్రాత పరిశుభ్రముగను, అక్షరములు విడివిడిగను ఉండవలెను. మీరెవ్వరికి వ్రాయుచున్నారో, వారు, మీరు వ్రాసినదానిని చదవవలెనని జ్ఞాపక ముంచుకొనుడు. అజాగ్రత్తగాను, నిర్లక్ష్యముగాను వ్రాసి, చదువువారికి, అనవసరమగు ము గలిగింపకుము. అక్షరములు పోల్చుకొనుటకు వీలుగ

నందునట్లేగాక, సుందరముగా ఉండునట్లు, సులభముగా చదువుటకు వీలుగ నుండునట్లు వ్రాయుడు. గొలుసుకట్టువ్రాత వీలైనంతవరకు మానవలెను.

(3) విరామ చిహ్నములు:— (,) కామా, (;) అర్ధవిరామము, (:) విరామము, (.) పూర్తివిరామము, చుక్క — లేక బొట్టు— ఈ విరామచిహ్నముల ఉండవలసినచోట్ల ఉపయోగింపుడు. విరామచిహ్నముల సరిగా పెట్టనిచో వాక్యముల అర్థమే మారిపోవును.

(4) శెలవు పుచ్చుకొనుట:— ఉత్తరము అకస్మాత్తుగా ముగియుట బాగుండదు. దానిని వ్రాయువానికేరు వ్రాయుటతో అంతము కాగూడదు. అందుచేత మర్యాదగా శెలవు పుచ్చుకొనుటకు కొన్ని సంప్రదాయములు పాటింపబడుచున్నవి.

ఉదాహరణ:—

మీ విశ్వాసపాత్రుడు, మీ మిత్రుడు, విధేయుడగు కుమారుడు, విధేయుడు, మీ శ్రేయోభిలాషి మున్నగునవి.

(వేరువేరు సంప్రదాయములు ఆయా ఉత్తరములలో యియ్యబడినవి)

శెలవుపుచ్చుకొనుట కుపయోగించు మాట, లేక మాటల, ఉత్తరముయొక్క తుదిమాటలకు క్రిందుగా కుడి ప్రక్కన వ్రాయవలెను.

ఉదాహరణము:—

ఇట్లు,<br>
మీ విధేయుడు,

(5) సంతకము:— ఇది తెలుపుచ్చుకొనుటకు ఉపయోగించు మాటలకింద, వాటికంటె కుడిప్రక్కన ఉండవలెను.

ఉదాహరణము:—

విధేయుడు,

రామమూర్తి

క్రొత్తవారికి ఉత్తరము వ్రాయునప్పుడు సంతకము స్పష్టముగా తెలియునట్లు ఉండవలెను. అట్లుండిన ఉత్తరము అందినవారు, దానిని వ్రాసినవారెవ్వరో తెలిసికొని వారిని సంబోధించి జవాబు వ్రాయుటకు వీలుండును.

(6) కవరు లేక కార్డుపై విలాసము:— ఉత్తరము ఎవరికి చేరవలెనో వారిపేరు ఎడమప్రక్కనుండి యీ క్రిందివిధముగా వ్రాయబడవలెను.

| తపాలాబిళ్ళ లేక టికట్టు |
|---|

శ్రీ

భువనగిరి శేషయ్యగారు,

57, సుల్తానుబజారు,

హైదరాబాదు.

ఉత్తరము వ్రాసినవారి చిరునామా కవరుకు ఎడమ మూల చిన్న అక్షరములలో ఉండుట మంచిది. అట్లుండినచో, మన ఉత్తరము తిరిగి మనకు పంపబడవలసిన పరిస్థితులు తట స్థించిన, తపాలాశాఖవారు దానిని చూచుకొని మనకు అందచేయగలరు.

మన సొంతకవరుల ఉపయోగించినచో తపాలబిళ్ళ లేక టికెట్టు, కవరుయొక్క కుడిమూల విలాసమునకుపైన అంటించవలెను. అట్లు అంటించక కవరుయొక్క రెండవవైపు అంటించనిచో ఉత్తరములపై విలాసము, టికెట్టుసరిగా ఉన్నదోలేదో చూచి మొహరు లేక స్టాంపు కొట్టు తపాలాజవాను, ఎక్కువ కాలము ఆపనికి వినియోగించవలసి వచ్చును.

సారాంశము:—

ఉత్తరము వ్రాయునప్పుడు, మొదటిపుటయొక్క పై భాగమున, కుడిప్రక్క మీ విలాసమువ్రాసి దానిక్రింద తేదీ వ్రాయుము. తరువాత దానిక్రిందగా ఎడమప్రక్కన సంబోధనవ్రాసి కామా పెట్టుము.

సంబోధనకు క్రింద, కుడిప్రక్కగా ఉత్తరము ప్రారంభించుడు.

ఉత్తరము చివర శెలవుపుచ్చుకొనుట కుపయోగించు పదముల (ఉదా:- మీ విధేయుడు మొదలగునవి) పుటకు కుడిపక్కన వ్రాయుము. ఆ పదములక్రింద, వాటికంటె కుడిప్రక్కన ఉండునట్లు సంతకము చేయుడు.

ఉదాహరణము:—

45, మార్కెట్టువీధి,
సికిందరాబాదు,
15-1-1949.

ఆర్యా,

వారమురోజులక్రిందట నేను పంపమనివ్రాసిన పుస్తకాలను, మీరు తక్షణమే నాకు పంపిన చాలా సంతోషించెదను.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
కందాళ రామమూర్తి

ఎవరికి ఉత్తరము వ్రాసితిమో వారియొక్క పూర్తి విలాసమును కవరు లేక కార్డుమీద వ్రాయవలెను. అది, తపాలాజవాను సులభముగ చదువుకొని, ఉత్తరమును, దానినియ్యవలసినవారికి, యిచ్చుటకు అనువుగా నుండవలెను.

పట్టణములలో నుండెడువారి విలాసమునకును, గ్రామములలో నుండువారి విలాసమునకును భేదముండును. పట్టణవాసుల యింటినెంబరు, ఆ యిల్లుఉన్న వీధి, ఆ వీధిఉన్న పేట పేరు ఇయ్యవలసిఉండును. గ్రామస్థుని విలాసములో, గ్రామము పేరు, తపాలా ఆఫీసుపేరు, జిల్లాపేరు; ఉత్తరము వేరొక రాష్ట్రమునకు పోవలసియున్న, ఆ రాష్ట్రముయొక్క పేరు వ్రాయను. ఈ క్రింద, రెండింటికిని ఉదాహరణము లియ్యబడినవి.

పట్టణములోనివాని విలాసము:—

శ్రీ మంథెన రామయ్యగారు,
365, కోమటివీధి,
ఇసామియా బజారు,
హైదరాబాదు.

గ్రామస్థుని విలాసము:—

శ్రీ గొబ్బూరి గోపాలరావుగారు,
రామగిరి (గ్రామము),
భువనగిరి (పోస్టు),
నల్లగొండజిల్లా,
హైదరాబాదు (సంస్థానం).

ఉత్తరముల రకములు.

ఉత్తరము లనేకవిధములు. సాధారణముగా మనము వాటిని రెండురకములుగా విభాగించవచ్చును.

1. వ్యక్తి లేక సంఘ సంబంధమైనవి.
2. వ్యాపార సంబంధమైనవి.

తల్లిదండ్రులకు, అన్నదమ్ములకు, యితర బంధువులకు, స్నేహితులకు వ్రాయు ఉత్తరములు, ఆహ్వానములు మున్నగునవి మొదటిరకమునకు చెందినవి.

బంధువులకు, స్నేహితులకు వ్రాయు ఉత్తరముల సంభాషణ శైలిలో వ్రాయవలెను. వారు దగ్గరనున్నప్పుడు వారితో మనము మాట్లాడురీతిగనే ఉండవలెనుగాని, వ్యాసములు వ్రాసినట్లు ఉండరాదు. అర్థముగాని, సందర్భశుద్ధిలేని లోకోక్తులను, సమాసములను, పెద్దపెద్దమాటలను ఉపయోగించరాదు. అసభ్యమగు మాటలు, భావములు అందులో చేరరాదు.

2 వ రకము:— వ్యాపారసంబంధమైన ఉత్తరములు, ప్రభుత్వసంబంధమైన ఉత్తరములు, దరఖాస్తులు, అర్జీలు, కోర్టు విన్నపములు, వార్తాపత్రికలకు వ్రాయు లేఖలు రెండవ రకమునకు చెందినవి.

ఈ రెండవరకమునకు చెందిన ఉత్తరములు స్పష్టముగను, క్లుప్తముగను ఉండవలెను. చెప్పదలచుకొన్న విషయము సూటిగా చెప్పవలెను. వ్యాపారస్థులకు, ఉద్యోగులకు, పత్రికాధిపతులకు ఎక్కువ తీరుబడి ఉండదు. అందుచేత పెద్ద ఉత్తరములను, సులభముగా చదువుటకు వీలులేని ఉత్తరములను వ్రాయుటవల్ల లాభములేదు. అనుకొనిన, ఆశించినపని అట్టివానివల్ల కాదు.

## జ్ఞాపక ముంచుకొనవలసిన కొన్ని ముఖ్యవిషయములు.

1. ఎంత చనువున్న స్నేహితులకైనను సరే, ఉత్తరములు పెన్సిలుతో వ్రాయరాదు.
2. రహస్యములున్న ఉత్తరములను పోస్టుకార్డులమీద వ్రాయరాదు. ఇతరులెవరు చూసినను బాధలేనట్టి సంగతులనే కార్డులమీద వ్రాయవలెను.
3. స్నేహితులకు, వారితో మాట్లాడు చున్నట్లుగనే, ఉత్తరముల వ్రాయవలెను.
4. వ్యాపార సంబంధమైన ఉత్తరములు క్లుప్తముగా, సూటిగా ఉండవలెను. అమర్యాదగను, అర్థము కాకుండగను ఉండరాదు.
5. ఏవైనా వస్తువులు పంపమని, ఏదైనా కంపెనీకి వ్రాయునప్పుడు, మీకు కావలసిన వస్తువులే రావలెనన్నచో, ఆ వస్తువుల వివరములు స్పష్టముగా వ్రాయవలెను. ఆ వస్తువు యొక్క వర్ణన, కాటలాగులోని దానినెంబరు, సైజు (పరిమాణము), రంగు, ఏసంవత్సరపునమూనాయో, వివరముగా తెల్పుటయేకాక; కంపెనీవారికి మీకు కావలసిన వస్తువేదో సరిగా తెలిసికొనుటకు ఉపకరించు యితర వివరములేవైనా ఉన్న, వాటినికూడ నీయవలెను. ఎన్నివస్తువులు కావలెనో ఏవిధముగా పంపబడవలెనో (అనగా టప్పాద్వారానా, ప్యాసెంజరు రైలుద్వారానా లేక గుడ్సుద్వారానా) వ్రాయవలెను.

6. ఎవరైనా వస్తువులు పంపమని మీకు వ్రాసిన, వారి ఉత్తరము మీకు అందినట్లు తక్షణమే వారికి తెలుపవలెను. అట్టి ఉత్తరములు జాగ్రత్తగా వ్రాయవలెను. ఏలనన ఆ ఉత్తరముల మూలమున, వస్తువులధర, వానిని మీరు పంపగల తారీఖు మున్నగు ముఖ్యవివరములు మీరు వారికి తెలుపవలసి ఉండును.

7. ఉత్తరముల వ్రాయుటలో మీ ఉద్దేశము మీ వ్యాపారమును వృద్ధిచేసు కొనుటయేగాన, మీ ఉత్తరము, క్రియదారునికి కావలసిన పూర్తి వివరములు కలిగియుండి, మర్యాద ధోరణిలో ఉండవలెను. నిర్లక్ష్యముగా వ్రాయుట వలన వ్యాపారము చెడిపోవును.

8. మీ కాతాదారునియొక్క ఫిర్యాదులకు, అవి సరియైనను కాకున్నను, సూటిగను, ఆలస్యము లేకుండగను జవాబు వ్రాయుడు. మీవల్ల తప్పు ఉన్న ఒప్పుకొని దానికి పరిహారముగ సూచన గావింపుడు.

9. పత్రికలలో వెలువడు ప్రకటనలకు బదులుగాగాని లేక వేరేగాని ఉద్యోగములకు దరఖాస్తులుపెట్టునప్పుడు, ఉద్యోగము యివ్వబోవు వారికి- మీ వయస్సు, అర్హతలు, అనుభవము, శీలమునుగురించి తెలుపగల పెద్దమనుష్యుల పేర్లు, యోగ్యతాపత్రములు, మీరు అపేక్షించు జీతము, మున్నగు అవసరమైన వివరములు వ్రాయవలెను.

10. ఎవరినైనా ఒకరిని, ఉద్యోగముకొరకు శిఫారసు చేయునప్పుడుగాని, ఏదైనా వ్యాపార విషయములో యింకొకరికి

పరిచయము చేయునప్పుడు గాని- అతనితో మీకెట్లు పరిచయము కలిగినది, ఎంతకాలమునుండి అతనితో పరిచయమున్నది, అతని సామర్థ్యము, యోగ్యత, అనుభవము, ముఖ్యముగా అతను దరఖాస్తు పెట్టిన ఉద్యోగమునకు అతను ఏవిధముగా తగినవాడో తెలుపుచు, అతని శీలమును గురించియు, అతడు నమ్మకస్తుడనియు వ్రాయవలెను.



తండ్రికి కుమారుని దగ్గరనుండి.

259, స్టేషన్ రోడ్డు,
సికిందరాబాదు,
25—10—1949.

నాన్నా లేక నాన్నగారికి,

నమస్కారములు. నేను యిక్కడకు సుఖముగా చేరినాను. రైలు సరిగా వేళకే వచ్చినది. స్టేషనుకు రామచంద్రరావువచ్చి నన్ను తనబసకు తీసికొని వెళ్ళినాడు.

నిన్న ఉదయము కాలేజీకి వెళ్ళి ఇంటర్మీడియటుక్లాసులో చేరినాను. మీరు యిచ్చినడబ్బు కాలేజీ ఫీజుకు, హాస్టలుఫీజుకు సరిపోయినది. నాదగ్గర రు 10/- మిగిలినవి. వాటితో కాపీలు, తెల్లకాగితములు కొనదలచినాను. పుస్తకాలకు డబ్బు త్వరలో పంపకోర్తాను. దాదాపు రు 50/- కావలసివచ్చును.

అమ్మ, సీత, చిట్టి జ్ఞాపకం వస్తూఉంటారు. కాని నేను మీకొరకు బెంగపెట్టుకోలేదని, బాగానే ఉన్నానని అమ్మతో చెప్పవలెను. దీపావళి పండుగకు వస్తాను.

తక్షణం మీ అందరిక్షేమం తెలుపవలెను.

ఇట్లు,
మీ కుమారుడు,
రామారావు

తండ్రిదగ్గరనుండి కుమారునకు.

రామవరం,
గండికోటపోస్టు,
కోదాడతాలూకా,
నల్లగొండజిల్లా,
4-6-1949.

చిరంజీవి రామారావుకు
లేక రామూ,

నేను నీ ఉత్తరముకొరకు ఎదురు చూచుచుంటిని. నీవు సౌఖ్యముగా చేరినందుకు చాల సంతోషించినాను.

కాలేజి హాస్టలులో స్థలం దొరకదనుకున్నాను. దొరకుట మంచిదైనది. పుస్తకములకొరకు నేడే రు 50/- మని యార్డరుద్వారా పంపినాను. కావలసిన పుస్తకములు కొని కొన్ని జాగ్రత్తగా చదువవలసినది.

మీ అమ్మ, సీత, చిట్టి, నేను బాగానే ఉన్నాము. మాకొరకు బెంగపెట్టుకొననందుకు చాల సంతోషము. దీపావళికి తప్పకుండా రావచ్చు.

సాయంకాలముకూడా చదువక ఆటలలో పాల్గొనవలంది. దానివల్ల నీ శరీరం గట్టిపడగలదు.

నీ క్షేమం, మరవకుండా, తరచు వ్రాయుచుండవలెను.

ఇట్లు,
నీ శ్రేయోభిలాషి,
సీతారామయ్య

తల్లికి కుమారుడు.

45 నెంబరుగది,
విద్యార్థి గృహము,
సుల్తానుబజారు,
హైదరాబాదు,
8-10-1946.

అమ్మా,
లేక అమ్మగారికి,

నమస్కారములు. నీవు చెప్పినట్లే రైలులో జాగ్రత్తగా కూర్చొని యిక్కడకు క్షేమంగా చేరినాను. వాగ్దానంప్రకారం యిప్పుడు నీకు ఉత్తరం వ్రాస్తున్నాను.

ఉండటానికి నాకు మంచిగది దొరికింది. మురుగువాసన లేదు. గాలి, వెలుతురు కావలసినంత గదిలో ప్రవేశించటానికి కిటికీలు గలవు. చుట్టుప్రక్కల యిండ్లలో మర్యాదస్థుల ఉండటంవల్ల చదువుకొనటానికి బాగాఉంది. దీనికితోడు మంచి స్నేహితుడొకడుకూడా దొరకినాడు.

భోజనం విషయంలో నీవుచెప్పినట్లు జాగ్రత్త పుచ్చు కొనుచున్నాను. పాలుత్రాగుట మానలేదు. వేళపట్టున భోజనం చేస్తున్నాను.

నీవు యిచ్చిన రూపాయలు యింకా ఖర్చుపెట్టలేదు. వాటితో యింటికి వచ్చేటప్పుడు చిట్టికి, వెంకాయకు ఆటవస్తువులు తీసుకొనివస్తాను. నా ఆరోగ్యం విషయం నీవు చింతపడ

వద్దు. చదువుకూడా బాగాచదివి క్లాసులో మొదటివాడుగా రావాలని ప్రయత్నిస్తున్నాను.

మీ అందరిక్షేమం వ్రాయకోర్తాను.

ఇట్లు,
నీ ప్రియపుత్రుడు,
గోపి

చిన్నాయనగారికి.

గంగవరం,
బోనకల్లుపోస్టు,
ఖమ్మంతాలూకా,
వరంగలు జిల్లా,
15-5-1930.

చిన్నాయనగారికి,
లేక చిన్నాయనా,

నమస్కారములు. మీరుకూడా వేసవి సెలవులలో యిక్కడికి వస్తారని, వస్తే యింగ్లీషు, హిందీ చెప్పించుకొనవచ్చునని ఆశపడినాను. కాని మీరు రానేలేదు. బదరీనారాయణ యాత్రకు వెళ్ళినట్లు తెలిసింది. దీపావళి సెలవులలోనైనా యిక్కడకు రావలసింది.

నన్ను మీరు హిందీని, ఆంధ్రసారస్వతపరిషత్తు పరీక్షలకు చదువమని చెప్పినారు. కాని నాన్న, నన్ను ఇరవైనాలుగు గంటలూ యింగ్లీషుపుస్తకం పట్టుకొని కూర్చోనమంటాడు. హిందీ పుస్తకంగాని, తెలుగు పుస్తకంగాని కనపడనీయటం లేదు, ఈ విషయంలో, నీవు నాన్నకు ఉత్తరం వ్రాయవలసింది. నీవు నాన్నకువ్రాస్తే, నాకు కొంచం ఊపిరి పీల్చుకొనటానికైనా అవకాశం దొరకవచ్చును.

నాకు తులసీదాసు రామాయణం టీకా తాత్పర్యములు గలది పంపవలెను. రోజూ రామాయణం పారాయణ చేయాలనుకుంటున్నాను. పారాయణకు అరగంటకంటె ఎక్కువకాలం

వినియోగించను. నాకు అర్థమయ్యే కొత్త పుస్తకాలు ఏమైనా ప్రకటింపబడితే వాటినికూడా పంపవలెను.

మీరు సుఖంగా యాత్రను పూర్తి చేసుకొని వచ్చాచ రనుకుంటాను.

ఇట్లు,
మీ విధేయుడు,
గోవిందు

అన్న పేర తమ్ముడు.

56, న్యూరోడ్డు,
దారాగంజి,
అలహాబాదు,
8—7—1940.

అన్నయ్యా,
లేక అన్నయ్యగారికి,

సమస్కారములు. నీవు వెళ్లినప్పటినుండి యింతవరకు ఉత్తరం వ్రాయలేదు. అమ్మ బెంగపెట్టుకొన్నది. నీ క్షేమం తక్షణం వ్రాయవలెను.

మన ఊరునుంచి మామయ్య యింకా రాలేదు. ధాన్యం బండీనైనా పంపలేదు. ఇంట్లో చాల చిక్కుగా ఉంది. నీవు ఏమైనా డబ్బు పంపితేగాని మాకు గడవటం కష్టమని అమ్మ వ్రాయమంది.

ఒదిన, పిల్లలక్షేమం, నీక్షేమం వెంటనే వ్రాయవలెను.

ఇట్లు,
విధేయుడు,
గోపాలం

## తమ్మునికి అన్నగారు.

30, వెంకటప్పవీధి,
త్యాగరాజనగర్,
మద్రాసు,
14—7—1940.

చిరంజీవి గోపాలానికి,
లేక గోపాలం,

నీ ఉత్తరం అందినది. ఇక్కడికి చేరినతోడనే ఊపిరి సలుపనంత పనిలో చిక్కుకొనిపోయాను. అందుచేత మీకు ఉత్తరం వ్రాయుటలో ఆలస్యమైనది. మేమంతా క్షేమం. అమ్మను అనవసరంగా బెంగ పెట్టుకోవద్దని చెప్పవలసింది.

రెండుమూడు రోజులలో నేను నీపేర రు 200/- పంపుతాను. మన ఊరినుండీ మామయ్యకాని, ధాన్యంబండీకాని వచ్చేవరకు ఆడబ్బు సరిపోతుందనుకుంటాను. కావలిస్తే మరల వ్రాయవలసింది.

మీ ఒదిన, పిల్లలు సుఖంగా ఉన్నారు. పెద్దకుఱ్ఱవాడు, గోపాలంబాబయ్యా, గోపాలంబాబయ్య అంటూ ఉంటాడు. నీవు సెలవులు యియ్యగానే యిక్కడకు రావలసింది.

అమ్మకు నమస్కారములు. మీకందరకు నా ఆశీర్వాచనములు.

ఇట్లు,
నీ పెద్దఅన్న,
వేంకటేశం

అన్న చెల్లెలకు.

46, రామకోట్,
హైదరాబాదు,
30—3—1949.

చిరంజీవి సౌభాగ్యవతి లక్ష్మికి,
లేక లక్ష్మీశ లేక సోదరీ,

అమ్మ వ్రాసిన ఉత్తరంవల్ల నీవు ప్రవేశపరీక్షలో నెగ్గి నట్లు తెలిసి చాల సంతోషించినాను. దానిపైపరీక్షకు కూర్చొనటానికి నీవు చదువుట ప్రారంభించెదవని ఆశపడు తున్నాను. ఆ పరీక్షకు కావలసిన పుస్తకములు ఏవి? నాకు వ్రాసిన వాటిని యిక్కడకొని, నీకు పంపెదను. పరీక్షకు తయారగుటలో, నా స్నేహితుడు విశ్వేశ్వరశాస్త్రి, నీకు చాల సహాయపడగల డనుకుంటాను. నీకు తెలియనిది అతనిని అడిగి తెలిసికొనవలసింది. నేనుకూడ అతనికి యిప్పుడే ఉత్తరం వ్రాస్తున్నాను.

నిన్న నేను బజారుకు వెళ్ళితే 'తెలుగు మెఱుగులు' అనే పుస్తకం కనపడినది. దానిని కొన్నాను. రేపునీకు బుక్కు పోస్టుద్వారా పంపగలను.

సరస్వతి ఏమిచేస్తున్నది? అమ్మకు నమస్కారములు.

ఇట్లు,
నీ ప్రియసోదరుడు,
శివరాం

స్కూలు హాస్టలులోఉన్న పిల్లవాడు హాస్టలుజీవితము
తన కిష్టములేదని తల్లికి వ్రాయుట.

కేశవహాస్టలు,
నిజామాబాదు,

అమ్మా, 24—10—1949.

నీ ఉత్తరము నిన్న అందినది. నాకెంతో ఆనందం కలిగినది. పొద్దున, బడి అయినతర్వాత, దానిని చదువుకొన్నాను. అది చదివినతర్వాత నామనస్సు యింటిమీద పోయింది. నిన్ను విడచివచ్చి ఒక్క నెల దాటనప్పటికిని, ఎన్నో సంవత్సరాలైనట్లు అనిపించుచున్నది. సంక్రాంతిసెలవులు యింకా ఎప్పుడో వచ్చుచున్నట్లు తోచుచున్నది. అప్పుడేకదా నన్ను నీవు రమ్మన్నది? నేను యింటిదగ్గరఉండి స్కూలుకు వెళ్ళి రావటమే, ఈ హాస్టలులో ఉండుటకంటె చాల బాగుండినది.

నాకు హాస్టలులో ఉండుట బొత్తిగా యిష్టంలేదు. నేను ఉన్న గదిలో 5 మంది పిల్లలున్నారు. అందులో కొందరు మంచివారు. కాని, మాకంటె పెద్దపిల్లలు ఎప్పుడు మమ్ము ఏడిపించుచు ఉంటారు. మేము ఏమి అన వీలులేదు. అంటే, చావబాదుతారు. మాస్టరుగారు దీపముల ఆర్పినామో లేదో చూచుటకు వచ్చివెళ్లినతర్వాతనే అల్లరి మొదలుపెట్టెదరు. అందుచేత ఆ విషయమాయనకు తెలియనే తెలియదు. ఇక్కడి మాస్టరులంటేకూడా నాకిష్టములేదు. దినమంతా పని చేయి

స్తారు. తప్పువస్తే చాలు, బెత్తంతో కొట్టుతారు. పిల్లలలో ఎక్కువమంది ఎంతో దుర్మార్గులు. ఒకళ్లిద్దరంటే నాకిష్టం. నన్ను ఈ హాస్టలులోనుండీ, యీ బడిలోనుండి తీసివేసి మన ఊరిలోని స్కూలులో చేర్చమని నాన్నతో చెప్పు.

ఇట్లు,

నీ ప్రియపుత్రుడు,

శేఖర్

తల్లి జవాబు.

లక్ష్మీనివాసము,
భువనగిరి,
చిరంజీవి శేఖరునకు, 26—10—1949.

ఆశీస్సులు. నీ ఉత్తరం అందినది. కేశవహాస్టలులో నీవు సుఖంగా లేవని నాకు విచారముగా నున్నది. ఇంటికోరకు బెంగ పెట్టుకొనుటలో వింతలేదు. ఎందుకంటే నీవు యిదివరకు యిల్లు విడిచి ఎక్కడ ఉండలేదుకదా? నాకుకూడా నీవు నాదగ్గరనే ఉండాలని ఎన్నోసారులు అనిపించినది, అనిపించుచుండును. కాని అంతా మనముకోరునట్లు జరుగదుకదా? నిన్ను నాదగ్గరనే ఉంచుకొనిన నీకు చదువుఎటులరాగలదు? నీవుపెద్దవాడవై, గొప్పగొప్ప పనులుచేసి, పేరుప్రతిష్ఠల ఎట్లు సంపాదించగలవు? ప్రతిపిల్లవాడు, అతను బాగుపడవలెనన్న, హాస్టలులో కొన్ని సంవత్సరాలు ఉండుట అవసరమని మీ నాన్నగారి ఉద్దేశము. ఈ విషయము నాకంటె వారికే బాగా తెలియును.

బాబూ నీవు ధైర్యంగా ఉండు. హాస్టలులోనే ఉండి, మాస్టరులు చెప్పినట్లువిని, చక్కగా చదువుకో. త్వరలోనే, నీవు, యితరపిల్లలవలె, యీ క్రొత్త జీవితానికి అలవాటు పడగలవు. ఇతరపిల్లల వేళాకోళపు మాటలకు లక్ష్యపెట్టకు. వాటివల్ల బాధపడుచున్నట్లు తెలియనీయకు. వారనేమాటలకు నీవు బాధపడుటలేదని తెలియుటతోడనే వారు నిన్ను ఏమీ అనకుండా వదలిపెట్టెదరు. బెంగవదలి ఉత్సాహంతోను, ధైర్యంగ ఉండు,

అమ్మ.

పినతండ్రి దగ్గరనుంచి.

సేవాగ్రామము,
వర్ధా,
4—10—1947.

చిరంజీవి ప్రకాశమునకు,
లేక ప్రకాశం,

ప్రపంచములోని మహాపురుషులలోకెల్ల గొప్పవాడైన మహాత్ముడుండు స్థలమునుండి నేను నీకు యీ ఉత్తరము వ్రాయుచున్నాను. నేను యిదివరకు అనుకున్నట్లే, నీవుకూడ సేవాగ్రామము పెద్ద స్థలమని అనుకొనుచుండవచ్చును. కాని, అది సరికాదు.

సేవాగ్రామము ఒక మామూలుగ్రామము. దాని ప్రక్కనే, పొలములలో, గాంధిగారి గుడిసెలు ఉన్నవి. ఒక చిన్న గుడిసెలో గాంధిమహాత్ముడు ఉండేవాడు. మహాత్ముని వెంటనంటి ఉండువారుండే గుడిసెలు రెండుమూడు గలవు. పిటినంటుకొనే ఒక గోశాల ఉన్నది. దానికి ఉత్తరపుదిక్కున వైద్యశాల ఉన్నది. దాని దగ్గరగనే చరఖాసంఘముయొక్క భవనము కలదు.

ఈ గుడిసెల ఫొటోలు నేననేకం తీసినాను. వాటిని నీవు నేను యింటికి వచ్చినతర్వాతనే, చూడగలవు. మహాత్ముడు యిక్కడ లేనప్పటికిని, యిక్కడికార్యక్రమము యథావిధిగనే సాగుచున్నది.

వర్ధాలో నేనింకా రెండుదినములుంటాను. వర్ధాను గురించి యింకొకసారి వ్రాస్తాను.

ఇట్లు,
నీ శ్రేయోభిలాషి,
రామచంద్రరావు

శిష్యునిదగ్గరనుండి గురువుగారికి.

గాలేపల్లి,
సిరిసిల్ల పోస్టు,
కరీంనగరం జిల్లా,
3—3—1943.

పూజ్యులైన గురువుగారికి,

నమస్కారములు, చాలదినములనుండి మీ దగ్గరనుండి ఉత్తరంలేదు. ఆరోగ్యంగాను, సుఖంగాను ఉన్నారని ఆశించుచున్నాను.

మీకు కొంచం శ్రమ యియ్యదలచుకున్నాను. నేను పరీక్షలో నెగ్గినందులకు మా నాయనగారు నాకు రు 50/- బహుమతిగా యిచ్చినారు. వాటితో చదువుకొనుటకు మంచి పుస్తకములు కొన నా కోరిక. కాని ఏ పుస్తకములు కొనవలెనో, నాకు సరిగా తెలియదు. నాకు తగిన పుస్తకముల పేర్లు, అవి దొరకుస్థలము, వ్రాసినచో వాటిని కొనుక్కొని సెలవులలో చదువుకొనెదను.

తప్పకుండా నా కోరిక నెరవేర్చెదరని నమ్ముచున్నాను.

ఇట్లు,
మీ ప్రియశిష్యుడు,
వెంకటేశం

గురువుగారినుండి శిష్యునకు.

శాంతికుటీరము,
దారాగంజి,
ప్రయాగ,
10—3—1943.

వెంకటేశం,
లేక వెంకటేశమునకు,

నీవు 3-3-1943 నాడు వ్రాసిన ఉత్తరం అందినది. అది చదివి చాల సంతోషించినాను.

నీకు మీ నాయనగారు యిచ్చినడబ్బు వృధా ఖర్చు చేయక జ్ఞానాభివృద్ధికి తోడ్పడుపుస్తకములకై వెచ్చించకోరుట నీ యోగ్యతకు తగినట్లుగానే ఉన్నది. నీవుకోరినట్లు యిందులో పుస్తకముల పేర్లు, అవిదొరకు స్థలములు వ్రాసిన కాగితం ఒకటి పంపుచున్నాను. వాటిని తెప్పించుకొని చదువ వలసినది.

నీకు దినపత్రికవకైనా వచ్చుచున్నదా? లేనియెడల మంచి పత్రిక ఒకటి వచ్చునట్లు ఏర్పాటు చేసికొన వలసినది.

పత్రికలవిషయం నేను వ్రాయనక్కరలేదు. నీకు తెలి యునుగదా!

దినమంతా పుస్తకముల చదువుటలోనే గడపక, మీ గ్రామస్థులతో పరిచయం చేసికొని, వారి కష్ట సుఖములలో పాల్గొని నీ చేతనైనంత సేవ చేయవలెను.

నేను ఆరోగ్యంగా ఉన్నాను. గాంధిమహాత్ముని జీవిత చరిత్ర వ్రాయుటకు వలయుగ్రంథముల సేకరించుచున్నాను.

జవాబు వ్రాయువలెను.

ఇట్లు,
నీ శ్రేయోభిలాషి,
రామదేవశాస్త్రి

ప్రియ స్నేహితునకు.

వకీలు శేషగిరిరావుగారి ఇంట్లో,
మానుకోట,
వరంగలు జిల్లా,
14-10-1949.

ప్రియమిత్రమా,
లేక మిత్రుడు రామారావుకు,

నమస్కారములు. ఇంతకుముందు నీకు ఉత్తరం వ్రాయ జాలక పోయినందులకు విచారించుచున్నాను. నేను ఊళ్ళో లేక పోవటమే అందుకు కారణము. మా మేనమామల ఊరకు పెండ్లికి వెళ్ళవలసి వచ్చినది. నిన్న సాయంత్రమే తిరిగి వచ్చి నాను.

వేసవిసెలవులు త్వరలోనే ముగియగలవు. కాబట్టి మనము యిద్దరం త్వరలోనే కలిసికొనగలము. అప్పుడు నేను సెలవులలో చేసినదంతా నీకు చెప్పగలను. నీవు ఏ తేదీ స్కూలుకు వచ్చుచున్నావో తెలిపిన, నేనుకూడ సరిగా ఆరోజునకే రాగలను.

ఒక్కసంగతి. మీ ఊరిలో మంచి మామిడిపండ్లు దొరకునని చెప్పినావు. వచ్చేటప్పుడు తప్పకుండా కొన్నిపండ్లు తీసికొని రావలసింది.

ఇట్లు,
నీ ప్రియమిత్రుడు,
నారాయణ

మిత్రునకు ఉత్తరము.

ఢిల్లీ వర్ణనము.

బ్లాకు నెం. 4,
రేడియో కాలనీ,
ఢిల్లీ,
10-5-1949.

మోహన్,

నేను మావాళ్ళతో యాత్రకు బయలుదేరినసంగతి నీకు యిదివరకే వ్రాసినాను. ఇక్కడికి మేము నాలుగురోజుల క్రిందట చేరినాము. రేపుసాయంత్రం బయలుదేరి మధురానగరమునకు వెళ్ళుచున్నాము.

ఇక్కడున్న నాలుగురోజులలో ఢిల్లీనగరమంతా తిరిగి చూసినాను. చూసినది నీకు తెలుప కుతూహలముగా ఉంది.

అతి పురాతనకాలమునుండి ఢిల్లీపట్టణము అనేక రాజవంశములకు రాజధానిగా ఉండినసంగతి నీకు తెలియును. పాండవుల ఇంద్రప్రస్థపురం యిదేనంటారు. ఇప్పుడుకూడ అది స్వతంత్ర భారతదేశానికి రాజధాని. అందుచేత యిక్కడ అనేక ప్రాచీనభవనములు గలవు. యమునానది ఒడ్డున ఎర్రరాతితో కట్టబడిన ఎర్రకోట (లాల్ కిల్లా) మొగలాయిరాజుల వైభవదర్పముల జ్ఞాపకమునకు తెచ్చుచున్నది. కోటలోపల 'మోతీమసిజిద్', 'దర్బార్ ఖాస్', చిత్రవస్తు ప్రదర్శనశాలలు చూచుటకు తగినవి. 1947 సంవత్సరము ఆగస్టు 15 వ తేదీ నుండి యీ కోటపై మన త్రిరంగుపతాకము ఎగురుచున్నది.

పాతఢిల్లీలో రెండుమూడు భవనములు చాల ప్రసిద్ధములు. 'చావడీబజారు' దగ్గరున్న జుమ్మామసీదుచూచి మేము ఆశ్చర్య చకితులమైతిమి. ప్రపంచములోని అన్ని ప్రార్ధనా మందిరముల కంటె యిది పెద్దదని చెప్పెదరు. శుక్రవారమునాడు ఢిల్లీ అంతటినుండి ముసల్మానులు యిక్కడ ప్రార్ధన (నమాజు) చేయుటకు వచ్చెదరు.

చాందినీచౌక్‌లోని 'సోనేకామసిజిద్', శిఖ్ఖుల గురు ద్వారము చూడవలసినవి.

ఢిల్లీని పూర్తిగాను, సరిగాను చూడవలెనన్న పదిరోజు లైన పట్టును. కాని మేమిక్కడ అన్నిరోజులుండుటకు వీలు లేదు.

ఆగ్రాలోకూడ ఒకదినము ఉండి యింటికి వెళ్లెదము. ఇంటినుండి మరల వ్రాసెదను.

ఇట్లు,
నీ ప్రియమిత్రుడు,
గోపాలం

మరణవార్త.

---

హనుమాన్ ఘాట్,
కాశి,
30-10-49.

రామేశ్వరరావుగారికి,

నిన్న రాత్రి 8 గంటల 15 నిమిషములకు, అక స్మాత్తుగా గుండె ఆగిపోవుటచే మా తండ్రిగారు మమ్ములనందరిని వదలి, పరలోకము చేరిరని తెల్పుటకు చాల దుఃఖించుచున్నాను.

ఇట్లు,
రామయ్య

---

పరామర్శ ఉత్తరము.

రామకుటీరము,
మోతీలాల్ రోడ్డు,
విజయవాడ,
2-11-1949.

రామయ్యగారికి,

పూజ్యులైన మీ తండ్రిగారు కాలధర్మము నొందిరని తెలుపు మీ ఉత్తరముచదివి దుఃఖితులమైతిమి. మీ తండ్రిగారి చివరగడియలలో మీరు దగ్గర లేరన్న సంగతి మాకు మరింత బాధ కలిగించినది. కాని భగవదిచ్ఛ అట్లున్నప్పుడు మన మేమి చేయగలము! ఆయన యాజ్ఞకు అందరముకూడ తలవంచ వలసిన దేగదా!

ఈ సంకట సమయములో పూజ్యులైన మీ తండ్రిగారి ఆత్మకు శాంతి నియ్యవలసినదని, యీ కష్టమును సహించుటకు వలయు ధైర్యస్థైర్యముల మీకు ప్రసాదింపవలెనని భగవంతుని ప్రార్థించుచున్నాము.

ఇట్లు,
రామేశ్వరరావు

## తల్లి మరణమునకై దుఃఖించుచున్న మిత్రునకు.

10, సుభాష్‌రోడ్డు,
బొంబాయి,
మార్చి 7, 1940.

ప్రియమిత్రమా,

మీ అమ్మగారు చనిపోయిన వార్త యీరోజుఉదయమే
నేను ఎంతో దుఃఖముతో విన్నాను. ఆవిడ జబ్బుగానున్నట్లు
మీ సోదరునివల్ల నాకు కొన్నివారముల క్రిందట తెలిసినది.
కాని అతడు దానిని ఏదో మామూలుజబ్బు అని చెప్పుటవల్ల
యిప్పుడీ చావువార్త విని నమ్మలేకపోతిని. ఈ మహావిపత్తులో
నిన్ను ఓదార్చుటెట్లో నాకు తెలియకున్నది. మీ అమ్మ
గారియందు నీకెంత ప్రేమో నాకు తెలియును. అయి
నప్పటికిని యీ తీరని నష్టమునకు దుఃఖముతో పిచ్చివాడవైన
నేమిలాభము? ధైర్యము చిక్కబట్టుకొని నీ భవిష్యత్తు విష
యమై ఆమె పెట్టుకొనియున్న ఆశల సాధించుటకు పూనుకొను
యే తగినపని.

నన్నుకూడ నీతోపాటు కుమారునిగ ఎంచిన మీ
మ్మగారి మృత్యువు నాకుకూడ తీరని నష్టమే. మీ నాయన
రికి ఎంతబాధగనున్నదో! వారికికూడ నా సానుభూతి
తెలుపగోరెదను.

ఎంతవ్రాసిన మీ దుఃఖము తీరును! దెబ్బ తగిలినవారికే దాని బాధ తెలియునన్నమాట నిజమే. కాని యీ కష్ట సమయములో నీతోపాటు నేనుకూడ దుఃఖపడుచున్నా ననుట కంటె ఏమిచేయుగలను?

ఇట్లు,
నీ మిత్రుడు,
రామారావు

## పరామర్శ ఉత్తరమునకు జవాబు.

7, నేపియర్ రోడ్డు,
పూనా,
మార్చి 10, 1949.

ప్రియమిత్రమా,

సానుభూతితో నిండియున్న నీ ఉత్తరమునకు కృతజ్ఞుడను. మాటలు దుఃఖమును పోగొట్టజాలవని వ్రాసితివి. కాని నీయట్టి స్నేహితుల సానుభూతి, యిట్టి విపత్తులో ఎంతో సహాయకారి; హృదయమునకు కొంత ఊరటనిచ్చును.

మా అమ్మచావు నన్ను దిగ్భ్రాంతుని చేసినది. లోకమంతా శూన్యముగా కనుపించుచున్నది. ఆమెకు నేనంటే ఎంతో ప్రేమ. నాకు ఆమెతప్ప లోకమేలేదు. ఈ జీవితమంతా ఆవిడ లేకుండా బ్రతుకుటెట్లా అనిపించుచున్నది.

ఆవిడ సుఖముగా మరణించినది. ఎట్టిబాధ పడకుండ నిద్రలో ప్రాణము వదలినది.

నీవంటే ఆవిడకు చాలప్రేమ. చనిపోయేముందు నిన్ను గురించి ఎన్నోసారు లడిగినది.

ఇంతకంటె వ్రాయజాలకున్నాను.

ఇట్లు,
నీ ప్రియమిత్రుడు,
దాశరథి

అభినందనములు.

ఎన్నికలలో నెగ్గినందుకు స్నేహితునకు.

లక్ష్మీవిలాసం,
గాంధిరోడ్డు,
రామనగరం,
జనవరి 6, 1949.

ప్రియసోదరా,

ఆంధ్ర సారస్వతపరిషత్తుకు అధ్యక్షుడుగా నీవు ఎన్నుకొనబడినందులకు నా హృదయపూర్వక అభినందనములు. సాహిత్యోపాసకులు నిన్ను ఎన్నుకొని, గత పాతికేండ్లనుండి సాహిత్యసేవ చేయుచున్న నిన్ను గౌరవించుటయేకాక, నీకలలనన్నిటిని రూపొందజేయుట కవకాశమిచ్చిరి. ఆదికాక, నీకంటె తగినవారెవ్వరు గలరు?

ఇదివరకువలెనే సాహిత్యముద్వారా మానవసేవకు పాటుబడగలవని ఆశించుచున్నాను.

నీ ప్రియమిత్రుడు,
ఆనందరావు

## పెండ్లిపిలుపు.

శ్రీమాన్ ....................................

మహాశయా,

నాచిన్నకుమారుడు చిరంజీవి వెంకటేశ్వరరావు (బి.ఎ.) కు, గుంటూరు వాస్తవ్యులైన దేశిరాజు శేషగిరిరావు పంతులుగారి రెండవకుమార్తె కుమారి ఇందిర (బి. ఎ.) కు గుంటూరు అరండలుపేటలో వివాహము జరుగగలదు. మీరు బంధుమిత్రులతో విచ్చేసి, మమ్ము కృతార్థులచేసి, వధూవరుల ఆశీర్వదించి. మా సత్కారములంద ప్రార్థించుచున్నాను.

వివాహ ముహూర్తము : పగలు 10 గంటలకు.

లలితామందిరము,<br>
స్టేషన్ రోడ్డు,<br>
హైదరాబాదు,<br>
20-12-49.

ఇట్లు,<br>
రామమోహనరావు.

## వివాహ అభినందనములు.

కిషన్‌పురం,
అనుమకొండ,
వరంగలు,
24–12–1949.

శ్రీ రామమోహన రావుగారికి,

చిరంజీవి వేంకటేశ్వరరావు వివాహమునకు రమ్మని మీరు పంపిన ఆహ్వానము అందినది. కృతజ్ఞుడను. ఈ శుభసమయమున మీ అందరకు నా అభినందనములు.

ఒక అవశ్యకార్య ముండుటవల్ల నేను యీ దినమున మద్రాసు వెళ్లుచున్నాను. వివాహదినమువరకు నేనుతిరిగిరాజాలనని వ్రాయుటకు చింతించుచున్నాను. కాని నా మనస్సు మీ అందరిమధ్యనుండి వివాహ మహోత్సవమునందు పాల్గొనుచుండునని గట్టిగా చెప్పగలను.

వధూవరుల భవిష్యత్తును ఆనందమయముగను, మంగళమయముగను చేయమని భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఈ శుభసమయమున చిరంజీవి వేంకటేశ్వరరావు కొన్ని పుస్తకములును, వధువుకు ఖాదీచీరను పంపుచున్నాను. స్వీకరింప ప్రార్థితులు.

ఇట్లు,
శుభాకాంక్షి
శ్రీకాంతరావు

పరిచయ లేఖ.

రాయచూరు,
10–11–1949.

శ్రీ ఆనందరావుగారికి,

ఈ ఉత్తరము తీసుకొనివచ్చు శ్రీ రాఘవేంద్రరావుగారు నా ఆప్తమిత్రులలో ఒకరు. వారు యిక్కడి హైస్కూలులో ఆంధ్రపండితులు.

తమ సొంతపనికొరకు శ్రీ రాఘవేంద్రరావుగారు విశాఖపట్టణములో నాలుగురోజు లుండగోరుచున్నారు. వారుండుటకు, వారి భోజనమునకు మీదగ్గరనే ఏర్పాట్లు గావించ కోరుచున్నాను. మీదగ్గర దిగిన వీరికి ఎట్టికష్టముండదని నా నమ్మకము. శ్రమకు క్షమించుదురుగాక.

పిల్లలకొరకు కొన్నపండ్లు వీరితో పంపుచున్నాను.

ఇట్లు,
రమాకాంతం

శిఫారసు ఉత్తరము.

శ్రీ రామారావుగారికి,

ఈ ఉత్తరము తీసికొనివచ్చు శ్రీ వెంకటేశ్వరరావు గారు మాదగ్గర పదియేండ్లు పనిచేసినారు. కార్యదక్షులు, లెక్కలు చక్కగా ఉంచగలరు. సమయస్ఫూర్తి, వివేచనా శక్తి గలవారు. మీ ఆఫీసులో పనిచేయుటకు అన్ని విధముల తగినవారు.

ఇట్లు,
విశ్వాసపాత్రుడు,
సంతకము.................

## విందునకు పిలుపు.

64, గాంధిరోడ్డు,
మారేడుపల్లి,
సికిందరాబాదు,
6–12–1950.

శ్రీ.........................................

మహాశయా,

నాపుత్రుడు చిరంజీవి గోపాలరావు ఆంధ్ర సారస్వత పరిషత్తువారి ప్రవేశ పరీక్షలో ప్రథముడుగ ఉత్తీర్ణుడాయెను. అందువల్ల రేపు ఆదివారము రాత్రి 8 గంటలకు మా ఇంట్లో విందు ఏర్పాటుచేసినాము. ఆవిందులో పాల్గొని మీరు మాఆనందమును ఇనుమడింప చేయుటయేగాక, మా ఏర్పాటుల సఫలీకృతము గావింప కోరుచున్నాను. మమ్ము నిరాశుల గావింపరని ఆశించుచున్నాను.

మీ దర్శనాభిలాషి,
గిరిధరరావు

## ప్రధానోపాధ్యాయులకు
## సెలవు దరఖాస్తు.

శ్రీ ప్రధానోపాధ్యాయులవారు,
ప్రతాపరుద్ర హైస్కూలు,
వరంగలు.

ఆర్యా,

నిన్న సైకిలుమీదనుండి పడుటవల్ల నా కాలికి బాగా దెబ్బతగిలి, వాచినది. అందుచేత బడికి రాజాలకున్నాను. నాకు నాలుగురోజులు సెలవుయియ్య ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
విధేయుడగు మీవిద్యార్థి,
మదనమోహనరావు,
9 వ తరగతి.

కొత్తపేట,
వరంగలు,
16-10-1949.

పరిషత్తు కార్యదర్శిగారికి.

కార్యదర్శిగారు,
ఆంధ్ర సారస్వతపరిషత్తు,
సుల్తానుబజారు,
హైదరాబాదు.

మహాశయా,

క్రిందటి సంవత్సరము మీరు జరిపిన పరీక్షలలో ప్రవేశపరీక్షయందు నేను నెగ్గినాను. పరీక్షాఫలితముల ప్రకటించి రెండునెలలైనది. కాని నాకింతవరకు జయ (సర్టిఫికెట్టు) పత్రము అందలేదు. దయయుంచి త్వరలో పంపకోరెదను.

తెలంగాణా ప్రాంతమునుండి ప్రవేశపరీక్షకు కూర్చొనిన వారందరిలో నాకు ఎక్కువమార్కులు వచ్చినట్లువిన్నాను. నిజమేమో తెలుపవలెను.

ఇంకొకవిషయము. మీరు ప్రవేశపరీక్షకు మించినది ఇంకేదైనా క్రొత్త పరీక్ష పరిషత్తుపక్షమున ఏర్పాటుచేసినారా? లేకున్న ముందు చేయబోవు ఆలోచనలున్నవా?

తిరుగుటపాలా జవాబు నియ్యకోరుచున్నాను.

| | |
|---|---|
| ? వినాయకరావుగారిఇంట్లో, | ఇట్లు, |
| సత్యనారాయణపురం, | మీ విశ్వాసపాత్రుడు, |
| భువనగిరి, | నాగరాజరావు |
| 14-10-1949. | |

పరిషత్తు కార్యదర్శి జవాబు.

ఆంధ్రసారస్వత పరిషత్తు,
సుల్తానుబజారు,
హైదరాబాదు,
27-10-1949.

శ్రీ నాగరాజారావుగారు,
వినాయకరావుగారియింట్లో,
సత్యనారాయణపురం,
భువనగిరి.

మహాశయా,

మీరు 14-10-1949 నాడు వ్రాసిన ఉత్తరము అందినది. మీ జిల్లానుండి పరీక్షలకుకూర్చొని, నెగ్గినవారి జయపత్రములన్నియు, మీ జిల్లా పరిషత్తు కార్యదర్శిగారికి పంపి దాదాపు ఇరువది దినములైనది. ఈపాటికి మీకు మీ జయపత్రము అందియుండవలసినది. అందనిచో, జిల్లా కార్యదర్శిగారిని కలిసికొని, దానిని తీసికొని, ఆ విషయము మాకుకూడ తెలుపవలసినది.

ప్రవేశ పరీక్షలో నెగ్గినవారందరిలో మీకే ఎక్కువమార్కులు వచ్చినమాట సత్యమే. ప్రథములుగా వచ్చినవారికి పరిషత్తుపక్షమున కొన్ని పుస్తకముల బహుమతిగా నిచ్చుట మా ఆచారము. ఆ పుస్తకములు మీకు వేరే పంపుచున్నాము.

వచ్చే సంవత్సరము నుండి పరిషత్తు విశారద పరీక్షను ఏర్పాటు చేయబోవుచున్నది. పాఠ్యగ్రంథముల పట్టిక త్వరలోనే మీకు పంపగలము. మీరు ఆ పరీక్షకు కూడ కూర్చొని ప్రథములుగా ఉత్తీర్ణులయ్యెదరని ఆశించుచున్నాము.

ఇట్లు,

సుగుణభూషణరావు,

కార్యదర్శి,

ఆంధ్రసారస్వత పరిషత్తు,

ప్రధానోపాధ్యాయులకు
సర్టిఫికెట్టు కొరకు.



శ్రీ ప్రధానోపాధ్యాయులవారికి,
నాగేశ్వరరావు హైస్కూలు,
విశ్వేశ్వరపురము.

ఆర్యా,

మా నాయనగారికి యీ ఊరినుండి, నిజామాబాదు బదిలీ అయినది. ఒకవారం రోజులలోపుగా మమ్మందరిని అక్కడికి తీసికొని వెళ్ళబోవుచున్నారు. కావున యిష్టము లేకున్నను నేను యీ స్కూలువిడిచి వెళ్ళవలసి వచ్చినది.

దయయుంచి నాకు స్కూలు సర్టిఫికెట్టు వీలైనంత త్వరలో యిప్పించకోరెదను.

విశ్వేశ్వరపురం,
6-9-1949.

ఇట్లు,
విధేయుడగు మీ ప్రియశిష్యుడు,
గోవిందరావు,
9 వ తరగతి

వార్తాపత్రికకు చందాదారుగా చేరుటకు.

మేనేజరుగారికి,
'ఆంధ్రపత్రిక',
7, తంబుచెట్టివీధి,
జార్జిటవున్, మద్రాసు.

మహాశయా,

ఈమధ్య ఒక స్నేహితునిదగ్గర మీ దినపత్రికను, వారపత్రికను, భారతిని, చూచుట తటస్థించినది. మీ పత్రిక లన్నియు నాకు వచ్చినవి.

నేను పై మూడుపత్రికలకు చందాదారుగా చేరగోరు చున్నాను. మనియార్డరుద్వారా చందా పంపుచున్నాను. మీకు అందిన తేదీనుండి నాకు పత్రికలు పంపుట మొదలు పెట్ట గోరెదను.

ఇట్లు,
విశ్వాసపాత్రుడు,
దామోదర రావు

వార్తాపత్రికా సంపాదకునకు.

సంపాదకులు,
యుగవాణి,
వికారాబాదు.

మహాశయా,

ఈ రోజున, 'దేశభక్తుడు' అన్న నా కథగల మీ యుగవాణి సంచిక అందినది. మీ పత్రికా రాజములో నా బోటివాని కథకు స్థానమిచ్చి, నన్ను ప్రోత్సహించినందులకు కృతజ్ఞుడను.

ఈ ఉత్తరముతోపాటు 'మా బాపు' అన్న గీతము నొక దానిని ప్రకటనార్థము పంపుచున్నాను. దీనినికూడ మీ పత్రికలో ప్రకటించెదరని ఆశించుచున్నాను.

సేవాశ్రమము,
ఆలేరు,
6-4-1949.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
కందుకూరి నరసింహారావు

పత్రికలో ప్రకటన వేయించుటకు.

సంపాదకులు,
మాతృభూమి,
సికిందరాబాదు.

మహాశయా,

నమస్కారములు. దయచేసి సుప్రసిద్ధమైన తమ దినపత్రికలో యీ క్రింది ప్రకటనను వేయకోరెదను.

బహిరంగసభ.

హైదరాబాదు హిందీ ప్రచారసభ పక్షమున 1948 సంవత్సరం మే 9 వ తేదీ సాయంత్రం 6 గంటలకు మార్కెట్టు వీధిలోని జంషెడ్ హాలులో 'వర్ధా విద్యావిధానము' నుగురించి విఖ్యాత విద్యావేత్తలగు శ్రీ ఆర్య నాయకంగారు ఉపన్యసించెదరు. ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు ంతులుగారు సభాధ్యక్షత వహించుటకు దయతో అంగీకరించి ారు. పురవాసులగు స్త్రీపురుషులెల్లరు సకాలమునకు విచ్చేసి సభను జయప్రదము గావించెదరుగాక.

కార్యదర్శి,
హిందీ ప్రచారసభ,
సికిందరాబాదు.

ఈ ప్రకటనను వేసిన మీ పత్రికా సంచికను మా ార్యాలయమునకు పంప ప్రార్థన.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
జయరామయ్య

[illegible]-4-1948.

సంపాదకులు,
తెలుగుపత్రిక,
హైదరాబాదు,

ఆర్యా,

మన మునిసిపాలిటీవారు గాఢనిద్రలో ఉన్నారు. వారికి ఎన్నిసారులు వ్రాసినను లక్ష్యపెట్టుటలేదు. కావున పత్రికలో వ్రాసిన తప్పుకాదనుకొంటాను. ఒక నెలనుండి సుల్తానుబజారు రోడ్డు నడవటానికి వీలులేని స్థితిలో ఉన్నది. వానలవల్ల రోడ్డు పైభాగము కరిగి రాళ్ళు పైకివచ్చినవి. పెద్దపెద్ద గుంటలు పడినవి. చీకటిరాత్రిలలో మోటారుకారులుగాని, బండ్లుగాని, సైకిళ్లుగాని, కాలినడకవారుగాని ఆ రోడ్డుమీద పోవుట చాల అపాయకరము. ఇదికాక రోడ్డుకు రెండుప్రక్కల కంకరగుట్టలు కలవు. ఇక రోడ్డుస్థితి వేరే వర్ణించవలెనా? వారములతరబడి ప్రజలు యిట్టికష్టములకు పాల్పడవచ్చుట చాల గర్హనీయము. ప్రజలు మేల్కొని, అధికారులదృష్టి నటుమరల్చి, త్వరలో రోడ్డు బాగుపడునట్లు చూడగలరని ఆశించుచున్నాను.

ఇట్లు,
విశ్వసనీయుడు,
చిత్రగుప్తుడు

కె. వెంకటరావు,
8, సుల్తానుబజారురోడ్డు,
హైదరాబాదు.

పుస్తకముల కంపెనీకి.

56, గాంధినగరం,
విజయవాడ,
3-3-1943.

మేనేజరుగారు,
వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండుసన్సు,
చైనాబజారు రోడ్డు,
జార్జిటవును, మదారాసు.

ఆర్యా,

నేను యీ పేటలో పుస్తకముల దుకాణము నొకదానిని పెట్టబోవుచున్నాను. మీరు ప్రకటించిన పుస్తకములపై ఎంత కమీషన్ యిచ్చెదరు? ఇతరుల పుస్తకములు మీవద్ద దొరకునా? దొరికిన, వాటిపై ఎంత కమీషన్ యిచ్చెదరు? వ్యాపారసంబంధమైన మీ షరతులు తెలుపగోరెదను.

మీరు ప్రకటించిన పుస్తకములయొక్క, మీదగ్గర దొరకు యితర పుస్తకములయొక్క కాటలాగులుకూడ దయచేసి పంపెదరుగాక.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
విశ్వాసరావు

పుస్తకముల కొరకు.

130, కింగ్సువే,
సికిందరాబాదు,
6-6-1946.

మేనేజరు,
వెంకట్రామ అండు కంపెనీ,
బుక్ సెల్లర్సు అండు పబ్లిషర్సు,
ఏలూరు.

ఆర్యా,

మీరు యీనెల 1 వ తేదీని వ్రాసిన 150 వ నంబరు ఉత్తరం అందినది.

దయచేసి యీ క్రింద నియ్యబడిన పుస్తకముల రైల్వే పార్శెలుద్వారా పంపి, రైల్వే రశీదును వి. పి. పి. ద్వారా నాకు పంపగోరెదను. మనియార్డరుద్వారా రు 5/- అడ్వాన్సు పంపుచున్నాను.

1. ఆంధ్ర మహాభారతము పద్యకావ్యము 7 వాల్యూములు 1 సెట్టు
2. ఆంధ్ర భాగవతము పోతనకృతము- 2 భాగములు 1 సెట్టు
3. భాస్కర రామాయణము 1 ప్రతి
4. రంగనాథరామాయణము 1 ప్రతి
5. మనుచరిత్ర 1 ప్రతి

ఇట్లు,
విశ్వాసపాత్రుడు,
రంగనాథరావు

ఉద్యోగముకొరకు దరఖాస్తు.

కార్యదర్శిగారు,
శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయము,
సుల్తానుబజారు, హైదరాబాదు.

మహాశయా,

నిన్నటి గోల్కొండ పత్రికలో, మీ గ్రంథాలయమునకు ఇంగ్లీషు, తెలుగు తెలిసిన గుమాస్తా కావలెనని మీరుచేసిన ప్రకటన చూచినాను. నేను మీ గ్రంథాలయములో పనిచేయ గోరుచున్నాను.

నేను మద్రాసు యూనివర్సిటీయొక్క ఇంటర్మీడియట్ పరీక్షలో నెగ్గినాను. నాకు ఇంగ్లీషు టైప్‌రైటింగు వచ్చును. ఇంటర్మీడియట్‌లో నా అభిమాన విషయములలో తెలుగు కూడ గలదు. నావయస్సు ఇరువది సంవత్సరములు. వేసవి సెలవులలో రెండునెలలపాటు రావు అండ్ కంపెనీలో, కంపెనీ శాఖ యిక్కడనుండి తీసివేయబడువరకు, పనిచేశాను.

మాకాలేజి ప్రిన్సిపాలుగారు, రావు అండ్ కంపెనీ మేనేజరుగారు ప్రసాదించిన యోగ్యతాపత్రములనకలులు యిందుతో పంపుచున్నాను.

మీ పనికి నన్ను నియోగించిన, నా శక్తికొలది, మీకు తృప్తికరముగా పనిచేయుటకు పాటుపడెదను.

48, కోమటివీధి,
నల్లగొండ,
14-11-1949.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
రాపాక రామానందశర్మ

### ఉపాధ్యాయపదవికి దరఖాస్తు.

ప్రధానాధ్యాపకులవారికి,
కేశవ మెమోరియల్ హైస్కూలు,
నారాయణగూడెము,
హైదరాబాదు.

మహాశయా,

నిన్నటి 'దక్కన్ క్రానికలు' పత్రికలోపడిన ప్రకటన వల్ల మీస్కూలుకు ఉపాధ్యాయులు కావలెనని తెలిసి, నేనొక అభ్యర్థిగా దరఖాస్తు పెట్టుచున్నాను.

నేను మదరాసు యూనివర్సిటీయొక్క బి. ఎ. పరీక్షలో రెండవతరగతిలో నెగ్గినాను. గణితశాస్త్రము నా అభిమాన విషయము. క్రిందటి సంవత్సరమే ఉపాధ్యాయ శిక్షణకూడా బడసినాను. శిక్షణబడయకపూర్వము, నాలుగుసంవత్సరములు, ఆంధ్ర విద్యాలయములో ఉపాధ్యాయుడుగా పనిచేసినాను.

మా కాలేజి ప్రిన్సిపాలుగారు, ఆంధ్ర విద్యాలయము ప్రధానోపాధ్యాయులవారు యిచ్చిన యోగ్యతాపత్రముల నకలులు యిందులో పంపుచున్నాను.

నన్ను ఉపాధ్యాయునికి తీసికొన్నచో మీకు తృప్తి కలుగునట్లు పనిచేయుటకు శక్తివంచనలేకుండ పాటుబడెదను.

44, స్టేషన్‌రోడ్డు,
హైదరాబాదు,
13-5-1949.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
రాజారావు

13, రాజావీధి,
బిట్రగుంట,
సెప్టెంబరు 5, 1940.

మేనేజరు,
రామా అండు కంపెనీ,
రామచంద్రరావుపేట,
ఏలూరు.

ఆర్యా,

మీపుస్తకముల కాటలాగులోని 28 పేజీలో వ్రాసినట్లు, రైల్వే పార్శెలుద్వారా నాకు ఆంధ్ర భారత, భాగవత, రామాయణముల (పద్యకావ్యములు) రు 30/- (ముప్పది రూపాయలకు పంపకోర్తాను.

రైల్వేరశీదును నాకు వి. పి. పి. ద్వారా పంపవలసినది.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
నాగేశ్వరరావు

గుమాస్తా కావలెనన్న ప్రకటనకు జవాబు.

24, పాతవీధి,
రాయచూరు,
3-10-1949.

శ్రీ ఆనంద్ అండు సన్సు,
వ్యాపారస్తులు,
వరంగల్లు.

మహాశయులారా లేక
ఆర్యులారా,

ఈరోజు గోల్కొండ పత్రికలో ఒక గుమాస్తా కావలెనని మీరుచేసిన ప్రకటనకు నేనొక దరఖాస్తుదారుడను.

నేను మొన్నమార్చిలో, యీఊరి హైస్కూలునుండి మెట్రిక్యులేషన్ పరీక్షలో రెండవతరగతిలో నెగ్గినాను. టైపు రైటింగు నా అభిమాన విషయము. నా వయస్సు 18 సంవత్సరాలు.

దీనితో కొన్ని యోగ్యతాపత్రములు పంపుచున్నాను. నా విషయమై మా హైస్కూలు హెడ్మాస్టరుగారికి వ్రాసిన తెలియగలదు.

నాకు మీరు ఉద్యోగమిచ్చిన మీకు తృప్తికరముగా నుండునట్లు పనిచేయుటకు నా శక్తికొలది పాటుబడగలవాడను.

ఇట్లు,
విన్నవించు విధేయుడు,
కొంధూరి నారాయణరావు

అభ్యర్థి లేక దరఖాస్తుదారు యోగ్యత తెలిసికొనుటకు ఉత్తరము.

శ్రీ కపిల రామయ్యగారు,
ఖమ్మంమెట్టు.

ఆర్యా,

శ్రీ గోవిందరావు తన దరఖాస్తులో అతనిని మీరు బాగా ఎరుగుదురని వ్రాసెను. మా ఆఫీసులో మేనేజరుగా పని చేయుట కాయనకు తగిన శక్తి సామర్థ్యములున్నవా? నమ్మకమైన మనిషా?

అతనినిచూసి సంభాషించిన తర్వాత, మాకు అతనంటే మంచి అభిప్రాయమే కలిగినది. కాని, ఎంతో బాధ్యతగల యీ పనికి అతనిని నియోగించేముందు, మాకు కలిగిన అభిప్రాయము సరియైన దగునో కాదో మిమ్మల అడిగి తెలిసికొన కోరుచున్నాము.

వీలైనంత త్వరలో మాకీ విషయమై జవాబు వ్రాయ ప్రార్థితులు.

ఆలేరు క్లాత్ మిల్స్,
ఆలేరు,
6-8-1947.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
సంతకము............
కార్యదర్శి.

## సరుకులు అరువుగా యిమ్మని.

అయ్యా,

క్రిందటిసారి మీరుపంపిన కలములఅమ్మకంవల్ల మాకు మంచిలాభం వచ్చినసంగతి మీకు తెలిసిన విషయమే. వాటిని రెండువారాల లోగానే అమ్మివేసినాము. ఇకముందు యిది వరకుకంటె మంచివ్యాపారం చేయగలమని ఆశించుచున్నాము.

అట్లుచేయుటకుతలచుకొన్న, మీరుమాకుసహాయపడగలరు. మాకు వసూలుకావలసిన మొత్తములు చాలా ఉన్నవి. అవి పది, పదిహేను రోజులలోగా వసూలుకాగలవు. అంతవరకు మేము మామూలుగా తెప్పించుకొను వస్తువులకే ఆర్డరు యియ్యగలము. కాని, యీనెలాఖరువరకు మీరుమాకు అరువు యిచ్చేటట్లయితే, యిదివరకు తెప్పించుకొనుసరకునకు రెట్టింపు సరకునకు ఆర్డరు యియ్యగలము.

సోమవారం లోపుగా మీరు మాకీ సదుపాయం చేయ గలరేమో తెల్పకోరెదము.

ఇట్లు,

మీ విశ్వాసపాత్రుడు,

సంతకము............

అందినసరకు బాగుండలేదని.

ఆర్యా,

మాదగ్గర, మీపౌన్ టెన్ పెన్నులు కొన్నవారిలో చాల మంది, అవి కారుతున్నవని, బాగుగాలేవని చెప్పుచున్నారు. దీనివల్ల మేము కష్టనష్టములకు పాల్పడవలసి వచ్చినది. ఈ లోపము మీరు యీమధ్య పంపిన కలములలోనే ఉన్నది. అంతకుపూర్వం పంపిన కలములు ఎట్టిలోపము లేక చక్కగా ఉన్నవి.

మీకార్ఖానాలో కలములు సిద్ధముచేయుటలో ఏదైనా లోపము జరిగినదేమో చూడగోరెదము.

మాదగ్గర మిగిలిఉన్న రెండుగ్రోసుల కలములు తిరిగి పంపుచున్నాము. మీరు మాకు తిరిగిపంపు సరకులో యీ లోప ముండదని ఆశించుచున్నాము.

జ్యోతిస్టోర్,
ఆబిద్ రోడ్డు,
హైదరాబాదు,
14-12-1948.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
సంతకము............
మేనేజరు.

(9)



క్రియదారుని ఫిర్యాదుకు జవాబు.

మేనేజరు,
జ్యోతి స్టోర్,
ఆబిద్ రోడ్,
హైదరాబాదు.

ఆర్యా,

క్రిందటిసారి మేము మీకుపంపిన కలములు తిరిగి పంపి నందులకు కృతజ్ఞులము. పంపుటకు అయినడబ్బు మాపేర ఖర్చు వ్రాయవలసినది. వాటిని తయారుచేయుటలో లోపము జరిగి నట్లు కనుగొంటిమి. మేము క్రొత్తగా తెచ్చిన యంత్రమొకటి సరిగా పనిచేయనందున ఆలోపము జరిగినది.

ఇదివరకువలెనే, యికముందుకూడ మా కలములు మీకు తృప్తికరముగా ఉండగలవు. మీరు తిరిగి పంపినవాటికి బదులుగా వేరే కలములు పంపుచున్నాము. మీకు కలిగిన శ్రమకు కొద్దిపాటి పరిహారముగా ఒకడజను కలములు ఊరికే పంపుచున్నాము. స్వీకరింపకోరెదము.

నిర్మల,
6-4-1946.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
సంతకము............
మేనేజరు,
శేషయ్య అండ్ కంపెని.

రావలసినపద్దును వసూలు చేసికొనుటకు.

అయ్యా/ లేక

ఆర్యా,

మా లెక్కలపుస్తకాలు చూచుటలో, జనవరిలో మా దగ్గర మీరుకొన్న పుస్తకముల బాపతు రు 8/- పద్దు కనపడినది. ఇంత చిన్న మొత్తము కొరకు మీకు వ్రాయుట మా కిష్టములేదు. కాని యిట్టి చిన్నపద్దుల ఎక్కువకాలముంచుట మా పద్ధతి కాదు. దయచేసి మీరు యీ మొత్తమును వీలైనంతత్వరలో పంపిన సంతోషించెదము.

ఇట్లు,

మీ విశ్వాసపాత్రుడు,

సంతకము.....

అడిగిన వస్తువులన్నీ పంపలేమని.

మేనేజరుగారు,
ప్రతిభా అండ్ కంపెనీ,
కరీంనగరము.

ఆర్యా,

మీరు 15 వ తేదీని యిచ్చిన ఆర్డరు అందినది.

మీరు పంపమన్న తేదీకి మీకు వస్తువులు పంపవలె నన్న, కాడ్‌లివర్ ఆయిల్ 20 సీసాలే పంపగలము. మీరు అడిగిన మిగతా వస్తువులన్నీ పంపగలము. మిగిలిన కాడ్‌లివర్ ఆయిల్ సీసాలు వారంరోజులలోగా అందజేయగలము.

ఇది మీ కనుకూలముగా నుండుననుకొనెదము.

కింగ్సువే,
సికిందరాబాదు,
6-5-1948.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
సంతకము.........
మేనేజరు,
ఆంధ్రా మెడికల్ స్టోర్సు.

సరకుల త్వరగా పంపమని.

మేనేజరుగారు,
చంద్రా అండ్ కంపెనీ,
ఆవడి,
మదరాసు.

ఆర్యా,

మార్చి 13 వ తేదీని మీరువ్రాసిన ఉత్తరానికి కృతజ్ఞుడను. దానిలో, మార్చి 3 వ తేదీని మేము పంపమని మీకువ్రాసిన సరకులు తక్షణం పంపుచున్నామని వ్రాసినారు.

సరకు యింతవరకు రాలేదు. మాకుచాల యిబ్బంది కలుగుచున్నది.

దయచేసి, మీరు ఆవస్తువులు మాకు వీలైనంతత్వరలో అందునట్లు చేయ ప్రార్థన.

శక్తికొలది మీరు ప్రయత్నించెదరని మాకు తెలియును.

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుడు,
సంతకము...............

# పత్రికా పఠనము

పత్రికా పఠనము సక్రమముగా చేయవలెనన్న పత్రికల గురించి పూర్తిజ్ఞానమవసరము. పత్రికలను, అవి ప్రకటింపబడు కాలము ననుసరించి యీ క్రింది విధముగా విభజించవచ్చును.

1. దిన పత్రికలు.
2. వార పత్రికలు.
3. మాస పత్రికలు.
4. త్రైమాస పత్రికలు.
5. వార్షిక సంచికలు.

దినపత్రికలు:—

దిన పత్రికలు ముఖ్యముగా వార్తలకు ప్రాధాన్యత యిచ్చును. ఏనాడుజరిగిన సంఘటనల, ఆనాటికో లేక మరునాటికో, పాఠకులకుఅందించుట వాటివిధి. స్థానిక వార్తలు,(అనగాపత్రిక ప్రకటింపబడు పట్టణములో జరిగినసంఘటనలగురించిన వార్తలు) జిల్లాలవార్తలు, దేశవార్తలు, విదేశవార్తలు అందులో ఉండును. రేడియో కార్యక్రమము, బజారు ధరలు, గుఱ్ఱపు పందెములు, ఆటల పోటీలు, సినిమాలు వీటినిగురించిన వార్తలుకూడ దిన పత్రికలు ప్రకటించును.

ప్రజలను ఎక్కువ కలవరపెట్టుచున్న, లేక వారి ఎక్కువ ఆకర్షించుచున్న ముఖ్యసమస్యలను గురించి ప్రత్యేక వ్యాసములుకూడ వాటిలో ప్రకటింపబడు చుండును. ఇంతే గాక ప్రతిదినమును, ఆనాడో లేక అంతకుపూర్వమో జరిగిన సంఘటనను గురించిగాని, లేక మరేదైన ముఖ్యవిషయముపై గాని, పత్రికా సంపాదకుడు, దానిగురించితనభావముల తెల్పుచు సంపాదకీయము వ్రాయును. దానికిక్రింద, సంపాదకీయములో చర్చింపబడిన విషయముకంటె కొంచముతక్కువ ప్రాధాన్యతగల వాటిని గురించి, ఉపసంపాదకీయములు ప్రకటింపబడును. ప్రజల దృష్టిని ఆకర్షింప వలసిన నాటి వార్తలు, పెద్ద పెద్ద అక్షరములలో ఈయబడుచుండును. కొన్ని దిన పత్రికలు, వారమున కొకసారి, వింత విషయముల గురించియు, కృషి, వాణిజ్య, సారస్వత, చారిత్రిక విషయముల పైనను వ్యాసములుగల అనుబంధములనుకూడ, దినపత్రికతో పాటు ప్రకటించుచుండును.

ప్రత్యేక సందర్భములలో, అనగా గాంధి జయంతి, స్వతంత్ర్య దినోత్సవము మున్నగు సందర్భములలో, ఆ సందర్భమునకు సంబంధించిన వ్యాసములు, వార్తలు గల ప్రత్యేక సంచికల, దిన పత్రికలవారు ప్రకటించుచుందురు.

వారపత్రికలు:—

దిన పత్రికలు వార్తలకు ఎక్కువ ప్రాధాన్యతయిచ్చిన,

ర పత్రికలు భావ ప్రచారమునకు ఎక్కువ ప్రాముఖ్యత
చ్చును. కొన్ని వారపత్రికలు రాజకీయములకు ప్రాముఖ్యత
యిచ్చును. కొన్ని సాహిత్యమునకు యిచ్చును. మరికొన్నిటిలో
ాజకీయ, ఆర్థిక, సారస్వత, వాణిజ్య సంబంధములేకాక, ఆ్న
విషయముల గురించి వ్యాసములుండును. పాఠకులసదుపాయము
ొరకు, ఆ వారములో జరిగినముఖ్యసంఘటనలగురించిన వార్తలు
సంగ్రహముగా వార పత్రికలలో నియ్యబడును. వీటిలోకూడ
సంపాదకీయ వ్యాసము, ఉపసంపాదకీయ వ్యాసములుండును.

మాస పత్రికలు:—

ఒక్కొక్క మాసపత్రిక, ఒక్కొక్క విషయమే ముఖ్యోద్దేశముగా గలిగి ప్రకటింపబడు చుండును. కొన్ని రాజకీయార్థిక పారిశ్రామిక విషయములను గురించియే వ్యాసముల, సంపాదకీయముల ప్రకటించును. కొన్ని కృషివాణిజ్యముల విషయమై చర్చించును. ఇక కొన్ని వృత్తి విద్యల గురించిన వ్యాసముల కలిగి, ఆయా వృత్తి విద్యలవారికే ఉపయోగించును.

త్రైమాస పత్రికలు:—

త్రైమాసిక పత్రికలలో గొప్ప గొప్ప విద్వాంసులు,
విధ విషయములగురించి, ఎంతోకాలము, ఎక్కువ శ్రమకో
్చి చేసిన కృషిఫలితములు ప్రకటింపబడు చుండును.

వార్షిక సంచికలు:—

వార్షిక సంచికలలో కూడ వివిధ విషయముల గురించినవ్యాసములు, కథలు, కావ్యములు, నాటకములు మున్నగునవి ఉండును.

పత్రికాపఠనము చేయువారికి, వివిధ దేశముల పటములు ప్రపంచచరిత్రజ్ఞానము చాల అవసరము, అవి రెండునులేకున్న వార్తల ప్రాధాన్యత చదువువారి మనస్సునకుపట్టదు. ఆయా స్థ ఘటనల ప్రభావము తెలిసుకొనుటకూడ కష్టముగానుండును. కావున ప్రతివారును మంచి దేశ పటములుగల పుస్తకమును ప్రపంచ చరిత్రను తమదగ్గర ఉంచుకొనుట చాల అవసరము.

